## గంటల పంచాంగం

శ్రీ ఆనందనామ సం. నిజభాద్రపద శు.పూర్ణిమ

1974వ సం. అక్టోబరు 1 మంగళవారం
మంగ: శు. పూర్ణిమ: ప. 4.08, ఉత్తరాభాద్ర: రా. 8.33, శేష వర్జ్యం: ఉ 6.48 వరకు.

1974వ సం. అక్టోబరు 2 బుధవారం
బుధ: బ. పాడ్యమి: ప. 4.59, రేవతి: రా. 9.56, వర్జ్యం: ఉ. 9.14 మొదలు 10.56 వరకు.


శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 — 1972)

ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబునకగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్
(మహాభారతము)

శ్రీ ఆనందనామ సం. నిజభాద్రపద శు.పూర్ణిమ
మంగళవారం


## చక్కెర పరిశ్రమాభివృద్ధి

భారత చక్కెర సాంకేతికుల సదస్సుసందర్భంలో మాట్లాడుతూ కేంద్ర వ్యవసాయశాఖసహాయమంత్రి శ్రీ బి. పి. మౌర్య ఆంధ్రప్రదేశ్ చక్కెర ఉత్పత్తి రంగంలో ముందంజ వేస్తోందన్నారు. దానికి అనకాపల్లిలోని పరిశోధనాసంస్థ, వ్యవసాయ విశ్వవిద్యాలయం తోడ్పడు తున్నాయని శ్రీ మౌర్య అన్నారు. ఆయన చక్కెర, ఆహారపదార్థాలలో ఏటువంటి స్థానం ఆక్రమిస్తున్నదో పేర్కొన్నారు. ఈ పదార్థం సామాన్య మానవుడికి అందుబాటులో ఉండాలన్నారు. స్వేచ్ఛా విపణిలో పంచదార ధరలు సామాన్య మానవుడికి అందుబాటులో లేవంటే అతిశయోక్తి కాదనిపిస్తుంది. చెరకులో చక్కెరశాతం, ఉత్పత్తితో అది లభ్యంగావడం ఎక్కువ దిగుబడి యిచ్చే పంటలు, యివన్నీఎంత ముఖ్యమో కేంద్రమంత్రి వివరించారు. ఎరువులు, నీరు మొదలైనవి బాగా దొరికినప్పుడే శ్రీ మౌర్య చెప్పిన అభివృద్ధి కూడా బాగా వీలవుతుంది. ఆయన ప్రపంచ మార్కెట్లలో చక్కెర వెల నూరు పౌనుల నుండి మూడు వందల డెబ్బయి పౌనుల దాకా పెరిగిందన్నారు. 1974లో 5 లక్షల టన్నుల పంచదార ఎగుమతి చేసి 230 కోట్ల రూపాయల విదేశీ ద్రవ్యం సంపాదించవచ్చునని శ్రీ మౌర్య అన్నారు. కాని దేశంలో పరిస్థితులనికూడా దృష్టిలోఉంచుకుంటే మంచిదనిపిస్తుంది. చక్కెర పరిశ్రమ విచారణ సంఘంవారు రోజుకి 2000 టన్నుల చెరకుని ఆడగలిగిన కర్మాగారాలు ఎన్నివుంటే అంత మంచిదని, ఇంత శక్తిని కల్పించుకొనటాన్ని ప్రోత్సహించాలని సూచించారు. ఈ సూచనని ప్రభుత్వంవారు అంతగా పట్టించుకున్నట్లు కనిపించలేదు. 1964లో అసలు చక్కెర లైసెన్సు ఒక్కటి కూడా యివ్వబడలేదట. 1967లో ఒక లైసెన్సు మాత్రమే మంజూరు అయిందట. 1968లో మూడు మంజూరుకాగా 1969లో 34 దాకా మంజూరు అయినాయట. లైసెన్సులు యిచ్చే పద్ధతి కూడా సహేతుకమైనదిగా కనిపించదు. ఆగస్టు, సెప్టెంబరు నెలల్లో పంచదార పరిశ్రమ రు 18 కోట్ల లాభం సంపాదించలేదని శ్రీ మౌర్య వాదించడం కొంత విచిత్రంగా వుంటుంది. ఫ్యాక్టరీలకి నష్టాలు వచ్చినట్లయితే, ఆ నష్టాలని పూడ్చడానికిస్వేచ్ఛావిపణిలో చక్కెర అమ్ముడు పోయినా సబ్సిడీలద్వారా ఎగుమతులను పెంచుకొన్నాభారాన్ని భరించేది ప్రజలేనని గుర్తించాలి.

# లలిత్ లీలాధర్ ధోలాకియా అరెస్టు: పేరు మోసిన దొంగ రవాణా వ్యాపారి

బొంబాయి, సెప్టెంబరు 30: పేరు మోసిన దొంగరవాణాదారులలో ఒకడుగా చెప్పబడుతున్న లలిత్ లీలాధర్ ధోలాకియా నిన్న బొంబాయి పోలీసులకు స్వయంగా లొంగిపోయాడు. పోలీసులు అతడిని అరెస్టు చేసి ఎరవాడా జైలుకు పంపించారు.

అంతరంగిక భద్రతా చట్టం క్రింద 16 మంది పేరుమోసిన దొంగరవాణాదారులను వారి ముఖ్య అనుచరులను అరెస్టు చేయడానికి వారెంటులు జారీ అయినాయి. నిన్న లలిత్ అరెస్టుతోపై 16 మంది అరెస్టుల కార్యక్రమం పూర్తి అయింది. వీరిలో బాఖియా మినహా మిగిలిన వారినందర్ని ఎరవాడా జైలుకు అక్కడ నుంచి యు. పి. రాజస్థాన్ జైళ్లకు తరలించారు.

సెప్టెంబర్ 18 నుంచి లలిత్ ధోలాకియా తప్పించుకుని తిరుగుతున్నాడు. ధోలాకియా అత్యాధునికమయిన పరికరాలు వైర్‌లెస్ సామగ్రి అమర్చిన తన విదేశీకారులో దొంగ సరకును చేరవేస్తూ ఉండేవాడు.

### కలకత్తాలో

కలకత్తా, సెప్టెంబరు 30: కలకత్తా ప్రాంతంలో పేరుమోసిన దొంగరవాణాదారులలో ఒకడయిన దిలీప్‌కుమార్ దత్తాను నిన్న 24 పరగణాల జిల్లాలోని బోన్‌గావ్ వద్ద అరెస్టు చేశారు.

న్యూఢిల్లీలో అంతరంగిక భద్రతాచట్టం క్రింద మరో ఇద్దరు దొంగరవాణాదారులను నిన్న అరెస్టు చేశారు.

## శ్రీ మంగళంపల్లి పట్టాభిరామయ్యకు సన్మానం

విజయవాడ, సెప్టెంబరు 30: ప్రముఖ సంగీత విద్వాంసుడు శ్రీ మంగళంపల్లి పట్టాభి రామయ్యగారి సహస్ర మాసజీవి తోత్సవం, సన్మానసభ నిన్న సాయంత్రం స్థానిక రోటరీ ఆడిటోరియంలో కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి అధ్యక్షతన వైభవంగా జరిగింది.

పలువురు సంగీత విద్వాంసులు, సాహితీవేత్తలు హాజరైన ఈ సభలో శ్రీ విశ్వనాథ ప్రసంగిస్తూ శ్రీ పట్టాభి రామయ్య ప్రజ్ఞా వైభవాలను ఉగ్గడించారు. శ్రీయుతులు ఎస్. ఎస్. మూర్తి, నూకల చిన సత్యనారాయణ, అరిపిరాల సత్యనారాయణ, మద్దులపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి, చెరుకుపల్లి పట్టాభి రామయ్య, మంగళంపల్లి సూర్యనారాయణ వంగర శ్రీ రామమూర్తిగారలు శ్రీ పట్టాభి రామయ్యగారి విద్వత్తును, ఆయన గుణగణాలను ప్రస్తుతించారు.

శ్రీమతి రాజ్యలక్ష్మి శ్రీ పట్టాభి రామయ్యకు రజిత పేటిక సమర్పించి సన్మానించారు. శ్రీ పట్టాభి రామయ్య ఉచిత రీతిని సమాధానం చెప్పారు.

సభానంతరం శ్రీ మంగళంపల్లి బాలమురళీ కృష్ణ వయోలా కచేరీతో శ్రోతలను పరవశులను చేశారు. శ్రీయుతులు దత్తాడ పాండురంగరాజు, కుమారి వి. బి. కనకదుర్గ వయొలిన్‌తోను, శ్రీ ఎల్లా వెంకటేశ్వరరావు, లక్ష్మీనారాయణ రాజు మృదంగంతోను, శ్రీ అన్నవరపు గోపాలం ఘట వాద్యంతోను శ్రీ మురళీ కృష్ణకు సహకరించారు.

## దళిత వర్గాల సంక్షేమానికి వివిధ రాష్ట్రాలలో ఏకీకృత పథకాలు: ఎ.ఐ.సి.సి. ప్రతినిధి సూచన

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాదు, సెప్టెంబరు 30: వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డు కులాల, తెగల అల్ప సంఖ్యాక వర్గాల సమస్యల పరిష్కారానికి అన్ని రాష్ట్రాలు శాస్త్రీయమైన ఒకేదృక్పథాన్ని చేపట్టాలని ఎ. ఐ. సి. సి. ప్రత్యేక ప్రతినిధి శ్రీ బి.బసవలింగప్పనిన్నఇక్కడపత్రికల వారితో మాట్లాడుతూ చెప్పారు.

సక్రమమైన పథకాలు లేకపోవడంవల్ల ఈ వర్గాల సంక్షేమానికి ఖర్చు పెడుతున్న డబ్బు వృధా అవుతున్నదని ఆయన అన్నారు.

ఈ వర్గాల సమస్యల పరిష్కారానికి వివిధ రాష్ట్రాలు విభిన్న పద్ధతులలో వ్యవహరిస్తున్నవని దీని ఫలితంగా ఈ వర్గాల వారి పరిస్థితి అధ్వాన్నంగానే ఉన్నదని ఆయన చెప్పారు.

దళితవర్గాల ప్రజలు తీవ్ర అసంతృప్తితో ఉన్నారని, తమజీవన పరిస్థితులు మెరుగు పరుచుకునే దృష్టితో ఏదో ఒక రాజకీయ పార్టీలో చేరాలని ఆలోచిస్తున్నారని శ్రీ లింగప్ప పేర్కొన్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని ప్రాంతాలలోహరిజనుల పరిస్థితి అధ్వాన్నంగా ఉన్నదని,బావుల నుంచి మంచినీరు తెచ్చుకోడానికికూడావారిని అటకాయిస్తున్నారని హరిజనవాడలు ఉన్న చోట్ల బస్సులు కూడా ఆపడంలేదని ఆయన తెలిపారు.

అన్ని రాష్ట్రాలలోను పర్యటించిన తర్వాత తాను కేంద్ర ప్రభుత్వానికి నివేదిక సమర్పించ గలనని ఆయన చెప్పారు.

దళితవర్గాల పరిస్థితులను పరిశీలించి తగు సూచనలు చేసేందుకు శ్రీ లింగప్పను ప్రత్యేక ప్రతినిధిగా పంపారు.

కోజికోడ్, సెప్టెంబరు 30: మూసహారు గ్రామం వద్ద మార్క్సిస్టు వ్యవసాయకూలీలకు రైతులకు మధ్య జరిగిన సంఘర్షణలో 27 మంది గాయపడ్డారు.

### వెండి ధర

సెప్టెంబరు 30:
హైదరాబాద్ మార్కెట్

| | | |
|---|---|---|
| వెండి 1 కిలో | రు. | 1020—00 |
| " 10 గ్రాములు | రు. | 10—30 |

## చిత్ర చరిత్రం (శ్రీనివాస్)

# ఛత్రపతి శివాజీగా కృష్ణ

"ధైర్యే సాహసే లక్ష్మీ" అన్న నానుడి హీరో కృష్ణకు నూటికి నూరుపాళ్ళు వర్తిస్తుంది. అనుకున్న పనిని ఎన్ని అడ్డంకులు వచ్చినా సాహసంతో, ఆత్మ విశ్వాసంతో సాధించడం అతనికి అలవాటు అని అతను నిర్మించిన చిత్రాలు నిరూపించాయి.

రామరాజుగా నటించి, ప్రజల హృదయాల్లో నిరంతర స్థానాన్ని ఏర్పరచుకున్నారు అనడం అతిశయోక్తి కాదు. తెల్లదొరలను గజగజ లాడించిన విప్లవవీరుడు రామరాజుగా నటించిన కృష్ణ ఛత్రపతి శివాజీగా నటించబోతున్నారు త్వరలో. యు. సూర్యనారాయణ నిర్మిస్తున్న ఈ ఈస్ట్‌మన్ కలర్ చిత్రం షూటింగు డిశంబరు నుండి జరుగుతుంది. ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వం, మహారథి మాటల బలం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రహణం, తోట కళానైపుణ్యం, కోటగిరి గోపాలరావు కూర్పు ఈ చిత్రం విశిష్టతకు దోహదం చేస్తాయనడం సత్యం.

అక్రమాలను అరికట్టడానికి కంకణం కట్టుకుని తన అసువులనే త్యాగం చేసిన అల్లూరి సీతారామరాజుగా నటించి మెప్పించిన హీరో కృష్ణ శివాజీ రూపంలో గూడా నిబ్బంభిస్తారనడంలో సందేహం లేదు. శివాజీ పాత్ర కృష్ణ చలనచిత్ర జీవితంలో మరచిపోలేని విధంగా, మైలురాయిగా నిల్చిపోగలదని నా నమ్మకం.

## బీహారు ఉద్యమానికి నైతిక బలం లేదు: దీక్షిత్ విమర్శ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 30: బీహారులో శ్రీ జయప్రకాశ్‌నారాయణ నాయకత్వాన జరుగుతున్న ఉద్యమానికి నైతికబలంలేదని, అది కేవలం రాజకీయ ప్రయోజనాలకోసం ప్రారంభించిన ఉద్యమమని దేశీయాంగ మంత్రి శ్రీ ఉమాశంకర్ దీక్షిత్ చెప్పారు.

మొన్న రాత్రి ఇక్కడ జరిగిన కాంగ్రెసువాదుల సమావేశంలో ఆయన మాట్లాడుతూ బీహారులో నిరాశ, నిస్పృహ చెందిన రాజకీయవాదులు అనేకమంది కలసి ఏదో విధంగా తిరిగి అధికారంలోకి రావాలని ప్రయత్నిస్తున్నారని వరదలవల్ల, దుర్భిక్షంవల్ల, అధిక ధరలవల్ల ప్రజలు బాధపడుతుండగా పరిపాలనను స్తంభింపజేయగలమని బెదరించడం ద్వారా జయప్రకాశ్‌వర్గం ప్రస్తుత పరిస్థితిని మరింత క్లిష్టం చేస్తున్నదని విమర్శించారు.

ఈ ఉద్యమాన్ని కాంగ్రెసువాదులు ఒక సవాలుగా తీసుకుని ప్రజలకు సేవచేయడానికి ఉద్యమించాలని దీక్షిత్ ఉద్బోధించారు.

### బీహార్ పి. సి. సి. విజ్ఞప్తి

పాట్నా, సెప్టెంబరు 30: బీహారు ప్రజలు, ముఖ్యంగా యువకులు జయప్రకాశ్ నాయకత్వాన అక్టోబరు 2వ తేదీ నుంచి జరిగే ప్రజా వ్యతిరేక ఉద్యమాన్ని ఒక సవాలుగా తీసుకుని ప్రతిఘటించాలని బీహారు ప్రదేశ్ కాంగ్రెసులోని రాజకీయ ఉపసంఘం ఒక ప్రకటనలో విజ్ఞప్తి చేసింది.

## పంటల అభివృద్ధికి హెచ్చు నిధుల ఆవశ్యకత: కేంద్ర సంఘానికి ముఖ్యమంత్రి విజ్ఞప్తి

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాదు, సెప్టెంబరు 30: ఆహార ధాన్యాల ఉత్పత్తులు శీఘ్రంగా అభివృద్ధి చెందడానికి వీలుగా ఇతోధికంగా నిధులు అవసరమని ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు తమతో చెప్పారని జాతీయ వ్యవసాయాభివృద్ధి సంఘం అధ్యక్షుడు శ్రీ నాథురామ్ మీర్ధా చెప్పారు.

ఈ సంఘం సభ్యులు గత రెండు రోజులుగా ఇక్కడ ముఖ్యమంత్రిని మంత్రులను, అధికారులను, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం అధికారులను, అభ్యుదయ రైతులను కలుసుకుని చర్చలు జరిపారు.

శ్రీ మీర్ధా నిన్నఇక్కడ పత్రికా గోష్ఠిలో మాట్లాడుతూ రైతులు మరింతగా లాభం వచ్చే పంటల జోలికి పోకుండా ఆహారధాన్యాలు పండించాలంటే రైతులకు ధాన్యంధర మరింత ప్రోత్సాహకరంగా ఉండాలని ముఖ్యమంత్రి తమతో చెప్పారని తెలిపారు.

తమ చర్చలు స్వల్పకాలిక, దీర్ఘకాలిక సమస్యలపై విపులంగా జరిగినవని భూముల, నీటివనరుల సక్రమ వినియోగం, భూగర్భ జల సంపద వినియోగం, విత్తనాలు, ఎరువులు పశుగణాభివృద్ధి, క్షీరోత్పత్తి, మత్స్య పరిశ్రమ, అడవుల అభివృద్ధి మొదలైన అనేక విషయాలపై తాము చర్చించామని, మీర్ధా పేర్కొన్నారు.

పంటకాల్వల అభివృద్ధికి కృషి చేయాలని, నీటివాడకాన్ని అదుపు చేయాలని, రాష్ట్ర ప్రభుత్వాధికారులకు తాము సూచించామని ఆయన పేర్కొన్నారు.

వ్యవసాయ కూలీలకు వేతనాలు పెంచాలని, వారికి కట్టించి ఇచ్చిన ఇళ్ల ఖర్చునువాయిదాలలో చెల్లించలేక పోతున్నారని, ఎల్. ఐ. సి. నుంచి డబ్బు తెచ్చినందున ఆ డబ్బునుచెల్లించే భారం రాష్ట్ర ప్రభుత్వం మీద పడిందని రాష్ట్రఅధికారులు తమతో చెప్పారని మీర్ధా పేర్కొన్నారు.

ఈ సంఘం 1975 జూన్ నాటికి తన నివేదికను కేంద్రానికి అందజేస్తుంది.

వీరు ఇంతవరకు పంజాబ్, హర్యానా, పశ్చిమ బెంగాల్, ఒరిస్సా, కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లలో పర్యటించారు.

## దినఫలం

1-10-1974 మంగళవారం
శక సం. 1896 ఆశ్వయుజ మాసం 9

★ మేషం: వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

★ వృషభం: రావలసిన డబ్బు అందుతుంది. ఆరోగ్యం బాగుంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

★ మిధునం: అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

★ కర్కాటకం: వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

★ సింహం: ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాల్లో ప్రయాసకు గురికాగలరు.

★ కన్య: వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

★ తుల: అనవసరమైన సందేహాలకు గురికాగలరు. దైవకార్యాలు నెరవేరతాయి.

★ వృశ్చికం: మీ ఆలోచనలు ఫలిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతిలభించగలరు.

★ ధనుస్సు: స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. పాటివారిలో గౌరవం లభిస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

మకరం: వృత్తిలో పోటీదారి పోటీ తగ్గుతుంది. సాహసిక వ్యవహారాలు లభించగలవు.

★ కుంభం: వృత్తిలో ప్రయోజనంగల సంభాషణలను జరపగలరు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

★ మీనం: మీ ప్రయత్నాలు లాభదాయకంగా ఉంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

— మహేష్



# భద్రాచలంలో రు.30 కోట్లతో కాగితం ఉత్పత్తి కర్మాగారం — ముఖ్యమంత్రి ప్రకటన

(ఆంధ్రపత్రిక ప్రత్యేక ప్రతినిధి)

భద్రాచలం, సెప్టెంబరు 30: ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు నిన్న సాయంకాలం ఇక్కడ బస్‌స్టాండ్ భవనాలకు శంకుస్థాపన చేశారు.

భద్రాచలం వచ్చే యాత్రికులకు ఈబస్సుస్టాండువల్ల మంచి ప్రయోజనం చేకూరగలదన్న ఆకాంక్షను ఆయన వెలిబుచ్చారు.

ఇక్కడ నుంచి మధ్యప్రదేశ్‌కు, ఇటు రాజమండ్రికి రాకపోకల సౌకర్యాలు వృద్ధి కాగలవన్న అభిప్రాయాన్ని ఆయనప్రకటించారు.

భద్రాచలంలో 30 కోట్ల రూపాయిలతో కాగితంమిల్లును నెలకొల్పదలిచామని ముఖ్యమంత్రి పేర్కొన్నారు.

గోదావరి తీరాన గల బొగ్గు గనుల నుంచి బొగ్గును పడవలద్వారా ఎగుమతిచేస్తామన్నారు.

దుమ్ముగూడెం దగ్గర తోడిపోత పథకాల అమలువల్ల గోదావరికి రెండు వైపుల పొలాలకు నీటిపారుదల సౌకర్యాలు అభివృద్ధిచెందగలవని ఆయన చెప్పారు.

భద్రాచలం, హైదరాబాద్ సూపర్‌డీలక్స్ బస్సుకు మంత్రి శ్రీ రాజారాం ప్రారంభోత్సవం చేశారు. ఆర్. టి. సి. అధ్యక్షుడు శ్రీ పి. నరసింగరావు మాట్లాడుతూ రాష్ట్రంలోని పుణ్యక్షేత్రాలన్నింటికి బస్సులు వేస్తున్నామన్నారు. ఖమ్మంజిల్లాలో బస్సు సర్వీసుల కోసం కోటిరూపాయిలు ఖర్చు పెడుతున్నామన్నారు. రాష్ట్రంలో బస్సు సౌకర్యాలఅభివృద్ధికి 25 కోట్ల రూపాయిలుకేటాయిస్తున్నామని ఆయన తెలియజేశారు.

ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు, మంత్రి శ్రీ రాజారాం, మంత్రి శ్రీ చొక్కారావుప్రభృతులు సీతారాముల ఆలయాన్నిదర్శించిపూజలు చేశారు.

## అక్టోబరు 8న నిరసన దినం: కాలేజి అధ్యాపకుల నిర్ణయం

('ఆంధ్రపత్రిక' ప్రతినిధి)

హైదరాబాద్, సెప్టెంబరు 30: అక్టోబరు 8వ తేదీన నిరసన దినాన్ని పాటించాలని రాష్ట్ర కళాశాల విశ్వవిద్యాలయ అధ్యాపకుల సంఘాలకు చెందిన తాత్కాలిక సంఘం నిర్ణయించింది. అఖిలభారత సమాఖ్య పిలుపుపై యీనిరసన దినాన్ని పాటిస్తున్నారు. నిన్న జరిగిన తాత్కాలిక సంఘం సమావేశంలో యీ నిర్ణయం గైకొన్నారు.

## చౌఎన్ లైకు ప్రధాని శ్రీమతి గాంధి సందేశం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 30: చైనా 25వ వార్షికోత్సవ సందర్భంగా చైనాప్రధాని చౌఎన్ లైకు ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి అభినందన సందేశం పంపారు.

చైనా పీపుల్స్ రిపబ్లిక్ 25వ వార్షికోత్సవ సందర్భంగా, చైనాప్రజలు, ప్రభుత్వానికి, తాము పంపే అభినందనలు, శుభాకాంక్షలు స్వీకరించవలసిందిగా ప్రధాని తమ సందేశంలో కోరారు.

## విజయవాడలో బాలల పుస్తక ప్రదర్శన

విజయవాడ, సెప్టెంబరు 30: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారు ఏర్పాటుచేసిన బాలల పుస్తక ప్రదర్శనకు మద్రాసులోని రష్యా దౌత్య ప్రతినిధి కార్యాలయ అసిస్టెంటు కమిషనర్ శ్రీ వి. ఎస్. పెస్లార్ ప్రారంభోత్సవం జరిపారు. 3000 లక్షల పుస్తకాలను బాలలకోసం రష్యా గ్రంథ ప్రచురణ కర్తలు ప్రచురించారని ఆయన చెప్పారు. బాలలలో పఠనాసక్తి పెంపొందించడానికి రష్యా ప్రభుత్వం శక్తివంచన లేకుండా కృషి చేస్తున్నదన్నారు.

విజయవాడ ఆకాశవాణి కేంద్రం డైరెక్టర్ శ్రీ బి. రజని కాంతారావు అధ్యక్షత వహించారు.

ప్రచురణాలయం మేనేజరు శ్రీ పి. పి. సి. జోషి ముఖ్య అతిథికి, ఆహూతులకు స్వాగతం చెప్పారు.

## మనమూ నాగరికులం?

ఏ దేశానికైనా శీలం వుంటుంది. ఆ దేశీయులు వారి దేశశీలానికి పరదేశాల్లో — ప్రతినిధులుగా వుంటూవుంటారు. వారి ప్రవర్తనను పట్టి వారి దేశపు సంప్రదాయాన్ని, సంస్కృతిని ఇతరులు అంచనా వేస్తారు. అందుకే దేశానికో జాతీయతాదృక్పథం, ప్రజలకో జాతీయతాభావం వుండాలని పెద్దలు అంటూ వుంటారు. కాని కాగడా వేసి వెదికినా యీనాడు మనదేశంలోనూ మన ప్రజల్లోనూ యిలాంటిని కనిపించే ఆస్కారంలేదని యీ నాడు భద్రతాచట్టం కిందికి వచ్చి తల్లొగ్గుతున్న వాళ్లని బట్టి చూస్తే తెలిసిపోతూంది.

జాతీయతాభావం వెల్లువకి వెల్లువలా పారిన రోజులు — మనకీ వుండేవి గతంలో. విదేశీ వస్తువుల బహిష్కరణ జరిపి విదేశీ వస్త్రాలను కాల్చి మసిచేశారట అప్పుడు. కాని యిప్పుడో? లక్షల విలువచేసే విదేశీ వస్త్రాలు తిన్నగా రాజమార్గాన దిగుమతి చేసే అవకాశం లేదు కనుక దొంగతనంగా రకరకాల పేర్ల దిగుమతి చేస్తున్నారు. ఇవి వెళ్లి దొంగతనంగా అంతకంత ఖరీదులు యిచ్చి కొనుక్కుంటున్నారు జనం! పరదేశీ వస్తువులపై ధనిక వర్గానికి ఎక్కువ మోజా వుండేది పూర్వం. కాని యిప్పుడది — సర్వే సర్వత్రా పాకింది. చీమల్లా డబ్బు కూడబెట్టి ఒక ఫారిన్ నైలెక్సు కొంటుందే గాని సామాన్య గృహిణి — ఒక ధర్మవరం పట్టుచీర కొన డానికి వెనుతీస్తుంది. ఇలా మనం అంటే గృహిణి సమాధానం ఏమిటో తెలుసా? 'పట్టు

## ఇదినారీ దృక్పథం ✻ కె రామలక్ష్మి ✻

చీరలు పట్టుమని పదేళ్లుంటాయా? వుండవు. సరిగ్గి ముడతలుపడి కట్టివిప్పిన ప్రతిసారీ యిస్త్రీ చేయాలి. పీట్లు కింతచాకిరీ చేసే బదులు హాయిగా వో ఫారిన్‌నైలెక్సు కొంటే బతికివున్నన్నాళ్ళు వుంటుంది. యిలా నీళ్లలో ముంచి తీస్తే మురికిపోయి కొత్తదానిలా వుంటుంది. అందుకే వాటిపై యీ మోజు. ఆకర్షణ.' నిజమే — కాని మనదేశంలో మిల్లులే తయారించిన ఇంతటి సిల్కు లున్నాయి. అవి విదేశీమార్కెట్టు కోసం అంటూ కేటాయించేస్తున్నారంటారు. మన వ్యాపారస్తులకో దుర్బుద్ధి వుంది. పై దేశాలకి పంపేవి చాలా బాగానూ, దేశంలో అమ్మకాని కుంచేవి చాలా హీనంగానూ తయారిస్తారు. అక్కడికి — మనవాళ్లకివి చాలవా అన్నట్లు! వ్యాపారస్తులకి నవతిబిడ్డల పట్ల చూపే దృక్పథం తొలగిపోతే — హాయిగా ఫారిన్ ముద్రకోసం వెతకరు మనవాళ్ళు.

' మన చేనేత వస్త్రాలకి విదేశంలో వున్న గౌరవం స్వదేశంలో లేదు. దీనికీ కారణం లేకపోలేదు. చేనేతవస్త్రాలు ఖరీదు పెట్టిగాని కొన్ని మంచివి రావు. వచ్చినా, పై గృహిణి అన్నట్టు వాటికి చేయవలసిన చాకిరీఎక్కువ. వాటి మన్నికా తక్కువే. ఇద్దరు చూడండి. ఎంత దేశభక్తితో దాన్ని కొని కట్టాలన్నా పట్టుమని పదినెల్లురాదు. చిరగడం మొదలు పెడితే ఆగదు. ఖరీదు ఎక్కువ. యివన్నిటినీ తోసిరాజని కొనాలంటే — డబ్బేది?

అందుకే — ధనికులు, దేశసేవకులు తప్పనిసరి సందర్భాలకి ఫురానాగా స్వదేశీ వస్తువులు ధరించుతూ వుంటారు. (అవసరానికి గాంధిటోపీ ధరించినట్టు!)

మన అద్దకాలకి, మన వస్త్రాలకి దేశంలో గిరాకీ పెంచే పెద్దఎత్తు ప్రయత్నంచేయాలి ముందు — అధికార వర్గం. యీ విషయంలో దేశీయులని చిన్నచూపు చూడ్డం వల్లే — దొంగవ్యాపారం వామనమూర్తిలా పెరిగి హిమాలయాల నుంచి కన్యాకుమారి దాకా వ్యాపించింది. అర్థంకాని కట్టుబాట్లు, అనవసరపు అధికార వర్గాల అడ్డంకులు అన్నీ కలిసి కాసిచెట్టి వీధికి, దొంగవ్యాపారుల కొట్లకి — దొంగతనంగా జనాన్ని పరుగెత్తేలా చేస్తున్నాయి. ఎగుమతి దిగుమతుల విషయంలో ప్రభుత్వం బేషజాలు వదిలితే తప్పింది — యీ దొంగవ్యాపారం పోదు. ఇంకో దారి వెతుకుతూనే వుంటుంది.

## మైసూరు మాజీ మహారాజా విషాదగాథ!

బెంగుళూరు, సెప్టెంబరు 28: ఇటీవల చనిపోయిన మైసూరు మాజీ మహారాజా శ్రీ జయచామరాజ వడియార్ లోకులకు దాదాపు రు. 70 లక్షలదాకా బాకీపడి వున్నట్లు ముఖ్యమంత్రి శ్రీదేవరాజ అర్స్ నేడిక్కడ విలేఖరులకు తెలియజేశారు.

మానసికంగా కృంగి, శారీరకంగా కృశించి, ఆర్థికంగా చితికిపోయిన స్థితిలో ఆయన మరణం సంభవించిందని, దానికితోడు సుఖ సంతోషాలులేని కుటుంబ జీవనం ఆయన మృతి మరింత త్వరగా సంభవించడానికి కారణమయిందని శ్రీ అర్స్ చెప్పారు.

ఆయన సింహాసనం అధిష్ఠించిన సమయానికే చాలావరకు పెద్ద అందరహాగతించారు. రాజ భవనంలో జరిగే కుట్రలు, ముఠా ఎత్తుగడలు మధ్య ఆయన దుఃఖయాత్రం ప్రారంభమయింది. నిజానికి ఆయన జీవితమంతా విషాద సంఘటనలతో కూడివున్నది. ఆయనచుట్టూ చేరిన బంధువులు అధికారులు ఆయనను బాగా ఉపయోగించుకున్నారు. ఈ విధంగా కొన్ని కోట్ల రూపాయలు స్వాహా చేయబడినవి." అని వివరించారు.

## బాలకాండ
యామిజాల పద్మనాభస్వామి

### 2వ సర్గ

తంశోణిత పరీతాంగం
చేష్టమానం మహీతలే
భార్యాతు నిహతం దృష్ట్వా
రురావ కరుణాం గిరమ్ 11
వియుక్తా పతినాతేన
ద్విజేన సహచారిణా
తామ్రశీర్షేణ మత్తేన
పత్రిణా సహితేనవై 12

ఆ దెబ్బతో మగపక్షి రక్తసిక్తమైన దేహముతో నేలమీదపడి గిలగిల కొట్టుకుని చచ్చిపోయింది. ఆ నిమిషందాకా ఎంతో యిది జంట తనకళ్లముందు వేటగాని కోలకి ఎరయై నెత్తురు మడుగులో మునిగి ఉన్న మగపక్షినిచూచి పెంటిరాతి గుండె కూడా కరిగేట్టు దానిచుట్టూ తిరుగుతూ ఏడ్వనారంభించింది.

తథావిధం ద్విజం దృష్ట్వా
నిషాదేనని పాతితం
బుషేర్ధ ర్మాత్మన స్తస్య
కారుణ్యం సమపద్యత 13

బోయవాని కోలదెబ్బకి అలా నేలకూలిన పక్షిని చూడగానే దయా ధర్మపరుడైన వాల్మీకి మనస్సు విపరీతశయుం వల్ల హృదుతో కదలి పోయింది.

తతః కరుణ వేదిత్వా
దధర్మో యమితి ద్విజః
నిశామ్య రుదతీం క్రౌంచీ
మిదం వచన మబ్రవీత్ 14

"ఔరా! యీ నీచుడు ఎంత ఘోరమైన పని చేశాడు. నోరూ వాయీలేని పక్షినిలందునా కామ క్రీడలో ఉన్నపక్షిని పడగొట్టాడే! అని ఆ కరుణామూర్తి వాల్మీకి తనలో అనుకుని ఏడుస్తూన్న ఆడపక్షిని చూసి విహరించి యిలా అన్నాడు బోయవాణ్ణిఉద్దేశించి.

[సశేషం]

## మాడూరి సమస్య

50 — 9

(10రూ.లుబహుమతిపొందినలేఖ)

మాపూరి గ్రంథాలయంలో 50 మంది సభ్యులు. అందులో 9 మంది కూర్చునేందుకు మాత్రమే స్థలం ఉంది.

సయ్యద్ ఉస్మాన్, ఇంటర్మీడియట్, హోళగుండా పోస్ట్, ఆలూరు తాలూకా, కర్నూలు జిల్లా.

### శ్రీ గిరి ఉద్యమం

అయ్యా! శ్రీ వి. వి. గిరి గారు ఒక ప్రకటనలో, నేడు దేశములో అరాచకము, అవినీతి, బ్లాక్ మార్కెట్, లంచగొండితనము మొదలగునవి పెరిగినవని ప్రకటించారు. దానిని నిరోధించుటకు అక్టోబరు 2 నుంచి బెంగుళూరులో ఉద్యమము ప్రారంభిస్తున్నట్లు తెలియచేశారు. ఈ విషయము చదివిన నాకు చాలా ఆశ్చర్యము కలిగినది. ఎందువలన అనగా కొలది కాలము క్రితమువరకు దేశములో కెల్ల అత్యున్నతమైన రాష్ట్రపతి పదవిని అలంకరించిన వి. వి. గిరి గారికి కేవలము ప్రస్తుతము ఈ దేశములో లంచగొండితనము, అరాచకము, అవినీతి, బ్లాక్ మార్కెట్ కనిపిస్తున్నట్లు ప్రకటన చేయుట చాలాశోచనీయము. వారు తాము అధికారములో ఉన్నప్పుడు నిరోధించలేని వి. వి. గిరి గారు, ఒక సామాన్య పౌరుడుగా ఉద్యమము ద్వారా సాధిస్తాననుకోవటం చాలా విచారించదగ్గ విషయము.

ఐ. లక్ష్మేశ్వరరావు, నోములవారివీధి, సంగడిగుంట, గుంటూరు.

### జీవహింస

అయ్యా! అక్టోబరు 2— గాంధిజయంతి నాడు హైదరాబాద్, విశాఖపట్నం, విజయవాడ, నెల్లూరు, చిత్తూరు,కడప,కర్నూలు, అనంతపురం, ఏలూరు, కాకినాడ, శ్రీకాకుళం, రాజమండ్రి, తెనాలి, తుని యిత్యాది అనేక మున్సిపాల్టీలు వధశాలలు మూసివేయవలసి వున్నది. వధశాలలు మూసివేయవలసిన రోజులలో 10 రోజులు ముందుగానే ఆయా మున్సిపాల్టీల కమీషనర్లకు ఆయా దినాలలో వధశాలలు మూసివేయుటయేగాకమాంసపు మార్కెట్ లోగాని, మున్సిపల్ లిమిట్సులో మరెచ్చటగాని అక్రమ జంతువధ జరుపు వారిపై, మాంసం విక్రయిస్తున్నట్లు కనుగొన్న వారిపై ఆంధ్రప్రదేశ్ మున్సిపాల్టీల చట్టం, 273వ సెక్షన్ప్రకారం తగిన చర్య గైకొనాలని కోరుతూ లేఖలు వ్రాయడం జరుగుతున్నది. ఆ లేఖలందినట్లు చర్య గైకొన్నట్లు చాలా తక్కువ మంది కమీషనర్లనుండి మాత్రమే జవాబులు అందుతున్నవి. ఒక్కొక్కచోట గర్భిణితోవున్న పశువులను, జబ్బుతో వున్న పశువులను వధిస్తున్నారు. వాటిపై తగిన నివారణలేదు. చట్ట విరుద్ధంగా వ్యవహరించువారిపై తగిన చర్య గైకొనుటలో మున్సిపల్ అధికారులు ఉదాసీనంగా వ్యవహరించడం దురూహ్యం. అక్రమ జంతువధ జరుపువారిపై, జంతువధశాలలు మూసివేయవలసిన రోజులలో జంతువధ జరుపువారిపై మున్సిపల్ అధికారులు స్వయంగా దర్యాప్తు జరిపి చట్టధిక్కార ప్రవృత్తిని ప్రజాబాహుళ్యంలో ప్రబలం కాకుండా యుండునట్లు చూడవలెనని, జీవరక్షా సంఘంవారు వ్రాయు లేఖలకు ఎట్టి చర్య గైకొన్నది తెల్పుచుండవలెనని ఉత్తర్వులు జారీ చేయగలందులకు రాష్ట్ర ప్రభుత్వాన్ని అభ్యర్థించుచున్నాను.

సీతారామకృష్ణ, కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ జీవరక్షా సంఘం, గుంటూరు—3, మకాం: హైదరాబాద్.

### మంత్రివర్గ విస్తరణ

అయ్యా! ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం విస్తరించబడి, ప్రమాణ స్వీకారం జరిగింది. కేవలము కొన్ని వర్గాలను సంతృప్తిపరచడముకోసమే ఈ విస్తరణ ఏర్పడినదని యావదాంధ్ర ప్రజలకు తెలిసిన సత్యసత్యము. ప్రభుత్వము ప్రజల నందరినీ పొదుపు చేయాలని శాసిస్తూ, తను మాత్రము ప్రభుత్వపు నిర్వహణ ఖర్చులు ఎక్కువ చేసుకుంటూ యున్నది. ఇది మిగుల శోచనీయం. రాజకీయపు ఎత్తుగడల చదరంగంలో ప్రజలు పావులుగా నున్నంతకాలము సామాన్య మానవుని జీవనము దినదినము నకూ దుర్భరమవుచున్నటులో సందియము లేదు.

దామరాజు సుబ్బారావు, 4—9—6/1, అగ్రహారం, ఏలూరు.

### ఉయ్యూరులో అగ్నిమాపక యంత్రం

అయ్యా! ఉయ్యూరులోను, చుట్టుప్రక్కల గ్రామములలోను ప్రతి సంవత్సరము అక్కడక్కడ అగ్ని ప్రమాదాలు జరుగుచున్న సంగతి అందరకు తెలిసిన విషయమే. అగ్నిని ఆర్పుటకు అగ్నిమాపక యంత్రములు ఉయ్యూరులో లేవు. గుడివాడనుండిగాని, విజయవాడనుండిగాని ఆ యంత్రములు అగ్ని ప్రమాదము జరిగిన స్థలములకు తెప్పించుకొనవలసి వస్తుంది. అవి వచ్చు సరికేఎక్కువభాగము అగ్ని దేవునకు ఆహుతి అవుచునే వున్నవి.

డాక్టరు కె. వి. రావు, రిజిష్టర్డు హోమియో ప్రాక్టీషనర్, ఉయ్యూరు.

